6 క॥ కరుణారస వరుణాలయ
కిరణామరమణికిరీట కీలిత వరనూ
పురమృదుచరణా కాంచన
విరచితపరిధానచరణ వేంకటరమణా ॥

7 క॥ రంగా గతిదృగ్జిత సా
రంగా సుందర విలాసరసితానంగా
రంగదలకభంగసమద
భృంగా సురధాంగధరణ వేంకటరమణా ॥

8 క॥ ఈశా మూహ్యాత్పద్మ ది
నేశా ఘనతర కరోద్యదిభసంకాశా
ఆశాపాశవినాశ ని
వేశా లోకేశభరణ వేంకటరమణా ॥

9 క॥ భద్రా స్వస్త్రీకృత వర
భద్రా కరుణాసముద్ర పరిహృతభువనో
పద్రవకరణక్షుద్రా
విద్రవదానందకరణ వేంకటరమణా ॥

10 క॥ సారా పారావార క
ఖీరా హైయంగవీన మృదుచోరా సు
స్మేరాననవరజారా
వీరా వారిరుహచరణ వేంకటరమణా ॥

11 క॥ ధీరా గోలోకాంతవి
హారా సత్సారహీరహారా ఘనస
త్కారా ముని మందారా
వీరా యతిమృదులచరణ వేంకటరమణా ॥

12 క॥ ఇష్టా ఖండితలోకా
రిష్టా యనుపమ కృపాగరిష్ఠా దైవో
త్కృష్టా భక్తజనమనో
భీష్టా స్రష్ట్రనుతచరణ వేంకటరమణా ॥

13 క॥ రామా రావణదనుజవి
రామా లక్ష్మీకుచయుగరాజితవక్ష
స్సీమా ముఖజిత సోమా
భీమా శరవర్గ హరణ వేంకటరమణా ॥

14 క॥ శ్యామా తులసీనళినసు
దామా ఘనసజ్జనసముదయకామా స
ద్ధామా సంగరపటురిపు
భీమా నుతభూరి కరుణ వేంకటరమణా

15 క॥ ఇంద్రా యశోజితశర
చ్చంద్రా నయవితరణాది సద్గుణ సాంద్రా
యింద్రియ ని స్తంద్రా కల
భేంద్రారిష్టద్రుతహరణ ! వేంకటరమణా !

16 క॥ జలజేక్షణ యదుభూషణ
బలిశోషణ పాపహరణ పాండవకరుణా
తులసీదామాభరణా
వెలయుము నాపాల సుగుణ! వేంకటరమణా!

17 క॥ మృద్భక్షణ నారాయణ
సద్భక్తార్తిం ర్విహరణ సారసచరణా
సద్భువనవాస మధుముర
భిద్భానుజకులధురీణ! వేంకటరమణా!

18 క॥ ఉద్యత్ఖరకరకోటిసు
ఖద్యోతననిభకిరీట ఖండితశకటా
ప్రద్యుమ్నజనక సంయమి
వేద్యా మృదుకమల చరణ! వేంకటరమణా!

19 క॥ అద్భుత యభ్యుదయాకర
సద్భుజబలశౌర్య ధుర్య సత్యౌదార్యా!
మద్భావస్థిర వరబల
భిద్భామణి తనుసుకిరణ! వేంకటరమణా!

20 క॥ దుష్కరదుర్భర దుర్గమ
పుష్కలదుష్కర్మ వహ్ని పుంజముచేతన్
శుష్కీ భూతమదీయా
విష్కరముఁ బ్రోవుకరుణ వేంకటరమణా!

21 క॥ భండన ఖండిత వారకో
దండా సురనాథవినుత ధార్మిక కరుణో
ద్దండ బలానుజ దండిగ
వెండియు నినుగొల్తుసుగుణ! వేంకటరమణా!

22 క॥ బృందారకరాజా భవ
సందేహా సమస్త భువన సన్నుతచరణా!
సుందర పోషితనర గో
విందా మద్భాగ్య సుగుణ! వేంకటరమణా॥

28 క॥ ఆద్యంతరహిత పూరుష
విద్యాధరసిద్ధసాధ్య వినుతచరిత్రా
సద్యః ఫలదాయక ఘన
విద్యాపారీణసుగుణ! వేంకటరమణా॥

24 క॥ శుభ్రేతరాభ్ర ఘృణిగణ
విభ్రాజిత విమలదేహ విపులకటాక్షా
విభ్రమిత సకలదిక్తట
బిభ్రద్భూభృత్త్రపూర్ణ ! వేంకటరమణా ॥

25 క॥ మధుర మధుసన్నిభాధర
విధువదన మదేభయాన వివిధసురూపా
కుధరధర ధీర మాధవ
విధిజనక సదాభిభరణ ! వేంకటరమణా ॥

26 క॥ సాధుజనబాధనిధనా
గోధన యధినాథ ధనద గోధరశయనా
బాధిత వైరివితానా
వేధఃపిత పాపహరణ ! వేంకటరమణా ॥

27 క॥ అక్షీణ బలపరాక్రమ
వక్షోభృతకౌస్తుభాంక వనజాక్షభవ
త్ర్యక్షవరరక్షణాంశము
వీక్షించ వదేమి సఘృణ ! వేంకటరమణా॥

28 క॥ రక్షాదక్ష విచక్షణ
పక్షీంద్రారూఢ నీకు పక్షంబైనన్
కుక్షివెత నోప లేకయు
పేక్షించితి నీదు కరుణ వేంకటరమణా॥

29 క॥ కుక్షిస్థాఖిలలోకా
పక్షీంద్రపతాక దాస పక్షవిచక్షా
భిక్షాచర బలిశిక్షా
విక్షేపము లుడుపు సఘృణ ! వేంకటరమణా ॥

30 క॥ రక్షక శిక్షక దక్షక
విక్షేపము లుడిపి ప్రోవు వేడుతొ దక్ష
దాక్షిణ్య మేర్పడంగా
వీక్షింపుము కమలచరణ! వేంకటరమణా॥

31 క॥ సాక్షివి సకలసులక్షణ
కుక్షివి కరుణా కటాక్షగుణచయపక్షా
రక్షింపు మనఁగ నెందుకు
వీక్షింపవు నన్నుఁ గరుణ వేంకటరమణా॥

32 క॥ శుంభత్స్వరమద ఖండన
జంభారితనూజమిత్ర జలజసునేత్రా!
కుంభజవైరినుతావన
బింబాధర భూరికరుణ! వేంకటరమణా॥

33 క॥ శుంభదవష్టంభభుజా
జృంభణభిత్కుంభికుంభి భేదితయవనా!
రంభోరు సదంభోరుహా
బింబాధరవదనమదన వేంకటరమణా॥

34 క॥ కుంభీంద్రవరదకుంభజ
సంభావిత సకలభువన సంభవగర్భా
కుంభనికుంభాసురహర
బింబోష్ఠ మదిష్ట భరణ వేంకటరమణా॥

35 క॥ మిత్ర కుల రాజపుత్ర సు
ఖాత్రసుతాగ్రజసుమిత్ర వృషవాక్చిత్రాఽ
మిత్ర సమాజలతాసుల
విత్రా మద్భరణ సుగుణ వేంకటరమణా॥

36 క॥ సద్యుతి మృగమదతిలకా
విద్యుద్ద్యుతి రుక్మచేల విమలవినీలా
సద్యస్త్రీముగ్ధచరితా
విద్యాధర వినుత చరణ ! వేంకటరమణా ॥

37 క॥ ఘోరతరకలుష సాయక
పూరితదేహుఁడగున న్నపూర్వకృపన్ మే
లారసిచూడుము మహో యా
భీరపదపవిత్రచరణ ! వేంకటరమణా ॥

38 క॥ అతి ఖరనక్రగ్రహ కర
గత కరిరాజవరుఁ డొండుగతి మతిలేకన్
ధృతిచెడి ని న్వేఁడఁగ వడి
వెత లుడిపినదొరవు సుగుణ ! వేంకటరమణా

39 క॥ లసదసమానగుణాఢ్యా
బిసరుహదళనయన వైరిభీకర సుకరా!
ప్రసరింపఁజేయు నాపై
విశదంబుగ నీదుకరుణ వేంకటరమణా ॥

40 క॥ ద్విజరాజవాహనధ్వజ
ద్విజరాజోపరిశయాన ద్విజరాడ్వదనా!
ద్విజవైరిదళన సద్భుజ
విజిత సమస్త భువనగణ వేంకటరమణా! ॥

41 క॥ దుర్జనులను నిర్జింపుచు
నూర్జింపుచు విబుధకోటి కొనరుయశంబే •
యార్జించి నించి మించిన
విర్జానద్యుపరిభవన ! వెంకటరమణా ॥

42 క॥ ఖరపుచ్ఛక్షేపహత
స్ఫురదాగమనిగమపుంజ సోమకపాట
చ్చర తళ్కుబెళ్కు తోల్కాడి
విరళపురుషవేషభరణ ! వెంకటరమణా ॥

43 సీ॥ నిష్ఠుర విపులకఠోర సు
పృష్ఠోపరిభాగనిభృత భూభృచ్ఛ్రేష్ఠా
కష్టమున నన్ బ్రోవంగ మద
భీష్టప్రదకమఠ నిపుణ వేంకటరమణా ॥

44 సీ॥ హాటకనేత్రాసురగిరి
పాటన పటువవిసమాన పాండురదంష్ట్రో
చ్చాటిత భూమికిటీ నా
పేటునం గాచికొనుము ఘృణ ! వేంకటరమణా ॥

45 క॥ దుడదుడ డింభకుఁ బ్రోవను
బెడిదపుఁగంభముఁ బగిల్చి భీకర గతిచే
కడువెడలిన నరసింహుఁడ
విడువక నన్ బ్రోవుసుగుణ ! వేంకటరమణా! ॥

46 క॥ బలిబలసంపన్నత కవి
చెలిమిని బొలియింప నిచ్ఛఁజెంది సునిష్ఠన్
ఇలఁజొట్టెడుబాపఁడవై
వెలసిన భిక్షానుచరణ వేంకటరమణా! ॥

47 క॥ ఆదరమున జమదగ్నికి
మోదమెసగఁబుట్టి బహుళభుజదండముపై
నూదినచటులకుఠార వి
భేదిత భూభార భరణ వేంకటరమణా! ॥

48 క॥ రాముఁడవై త్రిజగద్రిపు
భీముఁడవై రఘుకులాబ్ధి విమల సువిలస
త్సోముఁడవై వెలసినదొర
వేమరునన్ జూడు కరుణ వేంకటరమణా ॥

49 క॥ హాలివై యరివిదళన పటు
బలివై ఘననీలచేలివై నిర్మలివై
యిలభారహరణ ఫలివై
వెలసినరామాఖ్య భరణ ! వేంకటరమణా ॥

50 క॥ అపరిమితబలపరాక్రమ
త్రిపురాసురవరుల మదము త్రిప్పుటకొఱకై
కపటపు బుద్ధివై వెలసిన
విపుల విబుధప్రతరణ ! వేంకటరమణా ॥

51 క॥ ధాటిగల చాటునటనల
ఘోటకగమనుండ వగుచు ఘోరాటవులన్
మేటి కృపాణకరుఁడవై
వేటాడినకలికినిపుణ ! వేంకటరమణా !

52 క॥ స్ఫురదరవిందసులోచన
మరకతమాణిక్యహారమణిమయమకుటా !
వరలక్ష్మీకుచకుంకుమ
విరచిత వక్షోంకభరణ ! వేంకటరమణా !

53 క॥ ఖర కర వరకుల తిలకుఁడు
సురవరుల కసులభుఁడగుచు సురమునికోట్లన్
జెఱిచిన ఖరదనుజ శిరము
బెరికిన ఘనవితరణ గుణ ! వేంకటరమణా! ॥

54 క॥ పనచెడి వడి మొఱ లిడగను
కనరకసురవరుల కరుణం గాచిన సుగుణా!
యసమాన దోషకారుండ
విసువక నన్నేలు కరుణ వేంకటరమణా! ॥

55 క॥ పాదముల నూపురంబులు
మోదముగా నందగింప మురిపము మీఱన్
ఖేదము లుడుపను వడిగను
వేదజనక రమ్ము కరుణ! వేంకటరమణా! ॥

56 క॥ మకుటతటఖచితపటుమణి
నికరోదీర్ణాచ్ఛకాంతి నిండుగ నిగుడన్
నొకసారైనను నెదుటను
వికసింపుము కమలచరణ! వేంకటరమణా! ॥

57 క॥ యదుకుల దుగ్ధపయోనిధి
మృదుచంద్ర వినీలదేహ మృద్భక్ష సదా
సదమల నీ పదవనజమె
వెదకన్ మదిగొల్తుసుగుణ! వేంకటరమణా ॥

58 క॥ మధురతర వాక్ప్రచారా
విధిసురనుతసరసచతురవేదవిచర నీ
కథలెప్పుడు కర్ణములన్
విధిగా వినం జేయుసుగుణ! వేంకటరమణా! ॥

59 క॥ అనుదినము మునివరేణ్యులు
ననురాగము గదురమదిని నతులిత భక్తిన్
గనవేండెడు నీరూపము
విన మతింగనం జేయు నిపుణ వేంకటరమణా! ॥

60 క॥ పరమై కౌస్తుభమణి కా
కరమై సిరి కిరవగుచును గనుపట్టెడు నీ
యురము తులసిదళవాసన
విరివిగఁగొనఁ జేయు కరుణ వెంకటరమణా ॥

61 క॥ వరమై సూరిజనమనో
హారమై నెవ్వరికి నతిదురాపంబౌ నీ
చరణార్చన మొనరింపన్
విరళముగా గల్గు సుగుణ వెంకటరమణా ॥

62 క॥ వరణీయార్చారూపము
కర మరుదుగఁ బూని సకలకలుషఘ్నుఁడ వై
ధరనెలకొన్న స్థలమునకు
బిరబిర న న్ననుపు కరుణ వెంకటరమణా ॥

63 క॥ వాదా దయలేదా రా
రాదా నన్ బ్రోవ నిపుడు రాద్ధాంతముగా
మాదార బుధాధార సు
వేదారిప్రాణహరణ వేంకటరమణా ॥

64 క॥ దాతవు నిర్ణేతవు విధి
తాతవు సంభ్రాంత వెపుడుఁ దలఁప వహో నా
భ్రాంతా నన్ దలఁచిన మది
భీతా దుర్దనుజహరణ వెంకటరమణా ॥

65 క॥ ఉదరమున సకలజగములు
కుదురుగ నుంచుకొని యేలు గుణశీలుఁడ నీ
పదములు నమ్మిన నీచుని
బెదరుడుపన్ భరమ సుగుణ వేంకటరమణా ॥

66 క॥ గిరిమెత్తుటో కరిఁ గాచుటో
ధరాభరాహరణుఁడౌటో ధారుణి కోఱ్ఱ
ధరియించుటో నను నేలుట
వెర పేటికి బ్రోవు కరుణ వేంకటరమణా॥

67 క॥ మఱి మఱి నే మొఱలిడఁగను
సరి సరి వెఱవకు మటంచు సర్షపమంతేఁ
గరుణగల పలుకు బలుకవు
బిరుదా నీకిట్టి యఘృణ వేంకటరమణా॥

68 క॥ నీ పదములు మదిదలఁచిన
యాపదలటు దొలఁగఁ ద్రోచి యతులిత మతియై
నీపదమునందు నందురు
వేపక ననుఁజూడు కరుణ వేంకటరమణా॥

69 క॥ జలజాక్ష నీదు పదములఁ
బలుమఱు మదిఁదలఁచి మెఁగఁబటుభవజాలం
బుల ద్రోవ నంటి వేగమె
వెలిగా కిటు లుండవశమె వేంకటరమణా॥

70 క॥ పతితులఁ బావనులనుగా
వితతంబుగ జేతు ననుచు వేసిన బిరుదే
గతిఁజొచ్చె ననుచు మొఱలిడ
వెతకుచు రావేమి కరుణ వేంకటరమణా॥

71 క॥ ఘనఘనసారస్మేరా
'నన ఘనతనుకాంతిసార కనికరపు మనం
బునఁ గనరాదా నామొఱ
వినరాదా దనుజహరణ వేంకటరమణా॥

72 క॥ ఘననిభమా నీమేనను
కనక మయూంబరపుఁ గాంతి గడలు కొనంగా
వనదోపరి చపలల సర
విని దోచెఁ జూపు కరుణ వేంకటరమణా ॥

73 క॥ అరిపాటనపటువిక్రమి
యరి కరకమలంబునందు నమరగ లక్ష్మి
వర విచ్ఛేయుము వడిగను
వెర పుడుపను లోకభరణ! వేంకటరమణా ॥

74 క॥ కృష్ణా కృష్ణా యనుచును
కృష్ణ యనఁగఁ దృష్ణదీరఁ గీర్తి పరుఁడవై
వృష్ణివరు వేగ నేలిన
విష్ణుండవు నీవ సుగుణ వేంకటరమణా ॥

75 క॥ వడివడిగఁ బ్రోవు మన్నను
జడ నేమిటి కయ్యె పూర్వజడగతి యిపుడే
కడుఁదోచిన దైన్యను నిను
విడచుటలే దమిత కరుణ వేంకటరమణా ॥

76 క॥ సుడిఁబడి కడువడి మొరలిడ
నొడఁబడి యడుగిడవు కడకు నుడువవు దయచేఁ
జెడునడవడిగల కొడుకును
విడుతురె తలిదండ్రు లఘ్రుణ వేంకటరమణా ॥

77 క॥ తడ వేల నన్నుఁ బ్రోవను
బడిబడి పదములకు మ్రొక్కి పటుదైన్యము చే
పడితి నని విన్నవించఁగ
నెడలవు యడ్డలుదుపఁ గరుణ వేంకటరమణా ॥

78 క॥ ఇడుమలు నాపై నడరఁగఁ
జెడితిని కడతేర్పు మనుచుఁ జేతులనిండన్
కడుమ్రొక్కి వేఁడుకొంటిని
విడనాడకు మఖిలశరణ వేంకటరమణా ॥

79 క॥ మెండుగ దండము లిడి నీ
యండె మదిని గోరికోరి యండజశయనా
యుండియు నీదాసుఁడు కడు
బెండుపడెన్ బ్రోవు కరుణ వెంకటరమణా ॥

80 క॥ కందువలా గాకుంటే
పందెములా నాయెడలను పటుభవజాలం
బెందుకు విడఁజూడవు గో
విందా దీనార్తిహరణ వెంకటరమణా ॥

81 క॥ భారము నను దయఁజూడను
వేరొల్లక నిన్నె మదిని వేఁడినకతమా
మారాడక యిటులుండుట
వీరాగ్రణి శస్త్రసుగుణ వేంకటరమణా ॥

82 క॥ దురవస్థలచేఁ గుందుచు
హరి హరియని మొఱ లిడంగ నరయని విధ మీ
వఱకున్ గనుపించెను మది
వెరవెవ్వరు నాకు సుగుణ వేంకటరమణా ॥

83 క॥ గట్టిగ నాతలతోడే
వట్టిది గాదింక నమ్మి వసుధేశ హరీ
పట్టితి నీ పదవనజమె
బిట్టాడకఁ బ్రోవు కరుణ వేంకటరమణా ॥

84 క॥ తిట్టిన మఱి దీవించిన
పెట్టిన లేదన్న విసికి పేరెవు లిడినన్
ఒట్టెసుమీ నిను విడిచిన
బెట్టుగ నన్ జూడు కరుణ వేంకటరమణా॥

85 క॥ తెట్టెలు గట్టుక యున్నవి
యెట్టివొ మత్పాపచయము లిసుమంతైనన్
పట్టూడక వెతలిడ నీ
విట్టట్టుగఁ జూడకు ఘృణ వేంకటరమణా॥

86 క॥ జాలెందుకు లే దయయో
బాలేందు సమానఫాల పావన లీలా
మేలొందుదు నని నమ్మితి
నే లడుగను జూడు కరుణ వేంకటరమణా॥

87 క॥ జపతపములు నే నెఱుఁగను
యపరాధౌఘములె కాని యరయను సుకృతం
బెపుడో నను దయఁ జూచుట
విపులముగాఁ దెలుపు కరుణ వేంకటరమణా॥

88 క॥ వేదండతుండనిభకర
కోదండ విఖండితారి కుండలిశయనా
నీ దండ నమ్మినాఁడను
భేదం బిఁక వదలు సుగుణ వేంకటరమణా॥

89 క॥ దూరితి నని మది నుంచకు
ఘోరంబగు దురితచయము గురుగతినడరెన్
వారింప నోప నన్నిఁకఁ
జేరకున్నఁ జేర్చు కరుణ వేంకటరమణా॥

90 క॥ సారెకు సారెకు వినుమని
ఘోరముగా మొఱలిడంగ గోపమునేయక్
వారిజలోచన తగునా
వీరాగ్రణిమోదకరణ వేంకటరమణా ॥

91 క॥ దూరమ భారమ క్రూరమ
దా రెఱుఁగవ మేల రావు దరిగానక నే
నారూఢిగ నినువేఁడితి
వేఱుగఁ జూడకుము సుగుణ వెంకటరమణా॥

92 క॥ పతితాగ్రేసరుఁడను నే
నతులితసుగుణాఢ్యుఁ డందు రందఱునిన్నున్
జతకూడె నుభయులకు నిఁక
వెతలిడ కిటు కరుణఁజూడు వెంకటరమణా ॥

93 క॥ సరసుఁడవు శాంతశమదమ
పరిపూర్ణగుణాకరుఁడవు పరుఁడైన నినున్
శరణంబు గోర నేలెడి
బిరుదు సుమీ మరువకు ఘృణ వేంకటరమణా ॥

94 క॥ ప్రోచెద వని మది దలఁచిన
నీచపు మత్పాపచయము నీచెవిదండన్
గాచికొని పాడిచెప్పునో
వేచుట కతమేమి సుగుణ వేంకటరమణా ॥

95 క॥ కోపమ మత్పాపమ దయ
లోపమ సంతాప పడఁగ లోకాధ్యక్షా
తోపక నాముందర నను
వేపుట కే మ్మఖిల శరణ వెంకటరమణా ॥

96 క॥ పలుకవు దయఁజిలుకవు మది
దలఁకవు చలమేల నీలతమదేహా లో
సలుకలను మాని సన్నిధి
వెలయుము భూభారభరణ వెంకటరమణా ॥

97 క॥ వాచితి నీ సద్దయ కే
గాచితి నీ ద్వారమందు కరుణాకర నఁ
రాచిన గీచిన నూచిన
వేచిన ని న్వీడువ సుగుణ వేంకటరమణా ॥

98 క॥ అతులదయామతి వంచును
వితరణగుణశాలి వంచు వీనుల నిండఁ
సతతంబు విందు నిను నా
వెత లుడిపిటు చూపు కరుణ వెంకటరమణా ॥

99 క॥ కనరా మనవన వినరా
కనరావే వేఁడుకొన్నఁ గడు మొఱలిడఁగా
కనికర మిడి పనరావే
వినయ పశాలార్ద్రకరుణ వెంకటరమణా ॥

100 క॥ జని దాతవు జీవన భా
వననేతవు ఘోరపతిత పావనగుణ భా
మనయ త్రాతవు నీవే
వినుటకు నేలుటకు కరుణ వెంకటరమణా ॥

101 క॥ నిలుపవు దయఁ గొలుపవు మది
దలఁపవు దరి దెలుపవేమి దలఁతు పహో బల్
జాలుమా కలుముల కిలు మా
విలసిత బ్రహ్మాండ భరణ వెంకటరమణా ॥

102 క॥ నీచుని దరిఁ జేరుటకు న
రోచకమా యాచకుఁ డిటు రోఁజక గనప
ర్యాచకమా యచలకృపా
వీచికలను దోఁచు సుగుణ వెంకటరమణా ॥

103 క॥ చూచీ చూడని యట్లుగ
నీచుని న న్విడచితేని నెటుబోదు నిఁకఁ
గాచినఁ బ్రోచిన మఱి దయ
వీచిన నీవేను సుగుణ వెంకటరమణా ॥

104 క॥ కరమాగ్రహమా యిఁకఁ గిని
కరమా లోపంబదేమికారణ మోహా
మొఱవిన గమకించవు నఁ
విరివిగ నేలుమిఁకఁ గరుణ వెంకటరమణా ॥

105 క॥ చల మేమీ చంచలయగు
చెలిచెలిమని గన్న ఫలమొ చీమంతనా
దలఁపవు పలుకవు కలుగవు
వెలిఁజేయక జూడు కరుణ వెంకటరమణా ॥

106 క॥ పాపజ్వాలల దేహము
తాపింపుచున్నదయ్య దాసశరణ్యా
కోపించక వడి వెడలుము
వేపక నఁ బ్రోవు కరుణ వెంకటరమణా ॥

107 క॥ కంటికి నిదు రంటక మది
నంటినబాధలకుఁ బార మందంగా లే
కుంటిఁ గుంటిం బలె మొఱ
వింటివో మఱిలేదో కరుణ వేంకటరమణా ॥

108 క॥ సరసములా నన్నేచుట
మఱి నీకుఁ సరసము లవి మత్పాపినాప
త్కారమైయున్నవి మాను మ
నిరతముగా నేలు కరుణ వేంకటరమణా॥

తారావళి.

109 క॥ అక్కడ యిక్కడ నెక్కడ
నొక్కఁడవే యెక్కుడగుచు నూదిన నీరూ
పక్కజముఁ జూపిన సద్దయ
పిక్కటిలఁ బ్రోవు సుగుణ వేంకటరమణా॥

110 క॥ భవబంధనమోచన మతి
 వగతి నొనరించి నాకు జముబాధ లెడఁ
దవులనిరీతిని జూడుమి
వివరముగా నా ర్తిహరణ వేంకటరమణా॥

111 క॥ కృతాకృత్యములఁ జేయుమి మ
త్కృతి దోషముల్లఁ బాపి కేవలదయచే
సతతంబు నేలు మతులిత
వితరణగుణ యఖిలశరణ వేంకటరమణా॥

112 క॥ రోగమహోద్భుత పటుతర
సాగర మగుచుండ నగుచు సారె మొఱలిడఁ
బాగుగ నను దరిఁ జేర్పను
వేగిరపడి రావు సుగుణ వేంకటరమణా॥

113 క॥ మృగమదతిలకసుఫాలా
మృగరాజ సుమధ్యచిత్ర మృదుతరగాత్రా
పగతునిక్రియ నఁ జూడక
పెగలింపుము బాధ సుగుణ వేంకటరమణా॥

114 క॥ ఆనందకందసుందర
మానందనవైరివినుత మధుకరనేత్రా
నే నొందుబాధ నీకెటు
వీనందునఁ జొరదు సుగుణ వెంకటరమణా ॥

115 క॥ పురుషోత్తమ వరదేవా
కరుణాకర కార్యకరణ కామితఫలదా
స్ఫురదరిదరకర భవహర
విరివిగ నన్నేలు కరుణ వెంకటరమణా ॥

116 క॥ పురుహూతనందనార్చిత
వరచరణా శ్రితనిధాన వారిజనయనా
కలవా నీమది దయ యిదె
వెరవా నగ్గావ సుగుణ వెంకటరమణా ॥

117 క॥ ఆదిమదైవము నీవని
మోదముతో మ్రొక్కినాఁడ మోక్షాధిప నా
ఖేదము లుడుపను వడిగను
వేదోద్ధర గదలు కరుణ వెంకటరమణా ॥

118 క॥ మందరధర సుందరతర
యిందుముఖానందకంద యెందుకు మది న
న్నందుకొని కరుణఁ జూడవు
బృందారక వైరిహరణ వెంకటరమణా ॥

119 క॥ పుణ్యాకృతంబుల నెఱుఁగను
గణ్యత నను( జూడ రెవరు కమలాక్ష సుకా
రుణ్యము మది గీల్కొనఁ గా
వేణ్యము విడి యేలు కరుణ వెంకటరమణా ॥

120 క॥ ఉత్తరగర్భగు బాలకు
నుత్తమగతిఁ బ్రోచినట్టి యుత్తమగుణ నీ
చిత్తము నాపైఁ రాదా
విత్తవ్యధహారణ భరణ వెంకటరమణా ॥

121 క॥ హరహరి సురవర వినుతా
కరివరద కటాక్షవీక్ష కారుణ్యపరా
మురహర మ్రొక్కితి నాదెస
విరవిరఁ జూపు మిఁకఁ గరుణ వెంకటరమణా ॥

12 క॥ చిత్తజజనక జనార్దన
యుత్తమజనచిత్తసదన యూర్జిత కరుణా
కొత్తా పతితుల నేలుట
వృత్తేగద నీకుసుగుణ వెంకటరమణా ॥

123 క॥ స్వాతిక వర్షకణా వి
ఖ్యాతి న్నతి గోరు శుక్తి పుంజము క్రియ నీ
భూతదయాళుత్వము మది
ప్రీతిగఁ గోరితిని సుగుణ వెంకటరమణా ॥

124 క॥ వికచప్రభ చామీకర
వికచాంబుజ హారమహిత విజయాంకము
మకుటము రంజిల నెదుటను
వికసింపుము భవవితరణ వెంకటరమణా ॥

125 క॥ అనురాగము మది గదురక
వినతుఁడనై మ్రొక్కులిడుచు వేఁడఁగ భువనా
వన యేల కరుణతోడను
విని రా వదె మేల సుగుణ వేంకటరమణా ॥

126 క॥ జ్యేష్ఠుఁడవు దైవసమితికి
శ్రేష్ఠుండవు సకలమందు సేవకుని వడిఁ గ
బ్రేష్ఠముగ నేల నిటు పరి
వేష్టింపుము కష్టహరణ వెంకటరమణా ॥

127 క॥ మూలము బాధలకుఁ గ ధన
జాలంబని యెఱిఁగినాఁడ చటులత నది ని
ర్మూలంబు చేసి యేలుమి
పీలిఁకలే దమిత కరుణ వెంకటరమణా ॥

128 క॥ పూర్వకృత మే మనఁదును
నోర్వచ్చను జోటులేదు నోడితి శ్రమకుం
సర్వభర ముర్వీపాలక
వేర్వేడను దీర్పు కరుణ వెంకటరమణా ॥

129 క॥ ఉత్తర మేమని చెప్పుదు
నుత్తమకృతు లెపుడుఁ జేయ వుత్తారకతా
వృత్తి కెటు వత్తు వసుచో
బిత్తర మడఁగించు కరుణ వెంకటరమణా ॥

130 క॥ శ్రవణములు నీ కథల్ విన
నవనీధర చేయు మెపుడు నార్తివిహరణా
భవమోచన మొనరింపను
వివిధాయుధ రమ్ము సుగుణ వేంకటరమణా ॥

131 క॥ ధననిష్ఠాపరతఁ గ నిను
వినమఱచితి నీదుమూర్తి వివశుఁడ నగుచుం
గనమఱచితి క్షమియింపుము
వినతావన దైన్యహారణ వేంకటరమణా ॥

132 క॥ శతమఘనుత నతహారముఖ
నతజన హృత్పద్మ దివసనాథో త్తమ నీ
మతి కరుగ దేమి పాపమొ
వితతాద్భుత రూపభరణ వేంకటరమణా ॥

133 క॥ పూర్వాభద్ర కృతంబుల
నిర్వాహము నెత్తిమీఁద నెలకొని యుండెన్
దుర్వార ఘోర జాడ్యపు
వేర్విత్తును జిదుము కరుణ వేంకటరమణా ॥

134 క॥ ఉత్తరభద్రము కొఱకై
చిత్తము నీపైని జేర్చి చింతనసేయన్
దత్తరపడుచును సద్గుణ
వేత్తా రావేమి కరుణ వేంకటరమణా ॥

135 క॥ రేపల్లెనుండు గొల్లల
వాపికితన మెల్లఁ దీర వడినేలిన నీ
రూపము చూపింపు మికన్
రేపా సముద్రోవు సుగుణ వేంకటరమణా! ॥

136 క॥ శ్రీమద్వేత్ర్యాన్వయభవ
భామయ్యకుమార ధర్మపరపురి పదుఁడన్
ధీమణి శోభనగిరి గురు
ప్రేమ పదాశ్రితుఁడ సుగుణ వేంకటరమణా ॥

శ్రీ

# శ్రీవేంకటేశ్వరలఘుకృతులు

## వేంకటేశ్వరశతకము

1 క॥ శ్రీమానినీమనోహర
చామీకరదివ్యవసన సనకాదిముని
స్తోమనుతనామ సద్గుణ
ధామా శ్రీవేంకటేశ దైత్య వినాశా ॥

2 క॥ తామరసాయత లోచన
సామజవరదాన నిపుణ సకలధర ఘన
శ్యామల కోమల విగ్రహ
ధామా శ్రీ వేంకటేశ దైత్య వినాశా ॥

3 క॥ స్వామి హరీ వినతాసుత
గామీ సత్యావధూటికా వదనకళా
ధామచకోరాయితహృ
త్సీమా శ్రీవేంకటేశ శేషగిరీశా ॥

4 క॥ భీమానుజాతపరమ
ప్రేమాస్పదమిత్ర మిత్రవిధునేత్ర పరం
ధామా ధృతతులసీదళ
దామా శ్రీవేంకటేశ దైత్య వినాశా ॥

5 క॥ హేమాక్షదానవాంతక
కామాదివికారరరహిత కామితఫలదా
కామజనుఃకారణ రిపు
భీమా శ్రీవేంకటేశ భీతివినాశా ॥

6 క॥ భూమి న్నపదీయం బగు
నామముఁ బఠియించునట్టి నరుఁడు చిరాయు
శ్శ్రీమహితుఁడు పావనుఁ డగు
వేమరు శ్రీవేంకటేశ వృజిన వినాశా ॥

7 క॥ దేవా తావకమంత్రము
సేవకకలుషవనదాహ శిఖికీల నిభా
త్యావహము మోక్షలక్ష్మీ
సేవధియగు వేంకటేశ శేషగిరీశా ॥

8 క॥ దేవాదిదేవ నిర్మల
భావులు నిన్మానసమున భక్తిమెయిన్ సం
భావించి ముక్తిఁ గాంచిరి
కేవలముగ వేంకటేశ కిల్బిషనాశా ॥

9 క॥ కందర్పజనక బలభి
ద్వందితపాదారవింద వరద ముకుందా
మందరభూధరధర గో
విందా శ్రీవేంకటేశ వృజినవినాశా ॥

10 క॥ వేదాధివేద్య యాదిని
యాదోనిధి లోననుండు నగణిత శౌర్యున్
వేదహరణు సోమకునిన్
ఛేదింపవె వేంకటేశ ! శేషగిరీశా ॥

11 క॥ శరనిధిఁ గూర్మాకృతివై
తరిగట్టును వీపునందుఁ దాలిచి దయతో
సురలకు నమృత మొసంగవె
విరివిగ శ్రీవేంకటేశ ! వృజినవినాశా ॥

12 క॥ కిరివై దంష్ట్రాగ్రంబున
శరనిధిమగ్నమగు భూమిచక్రము పునరు
ద్ధరణ మొనరించి తీవే
పరమపురుష వేంకటేశ ! భవభయనాశా ॥

13 క॥ కంబమునఁ బుట్టి దైత్యుని
శంబనఖాగ్రములఁ జీరి జమునిపురికి వే
గంబె యనిచి జగముల కభ
యం బొసగవె వేంకటేశ ! యఘచయనాశా ॥

14 క॥ అలవామనరూపంబున
బలసాహస విక్రమాది వరగుణశాలిన్
బలి నడుగంటన్ ద్రొక్కవె
జలజాక్షా వెంకటేశ శత్రువినాశా ॥

15 క॥ ముయ్యేడుమార్లు రాజులఁ
గయ్యమునం బరశుధార ఖండించి భువిన్
నెయ్యమున భూసురావళి
కియ్యవె శ్రీవేంకటేశ ! యింద్రాధీశా ॥

16 క॥ భూమిన్ బంక్తిస్యందన
భూమీపతి చేయుచెడుగు పోడ వడఁగింపన్
రామావతార మొందిన
సామీ శ్రీవేంకటేశ ! శత్రువినాశా ॥

17 క॥ తాటక నొక్కశిలీముఖ
పాటవమున ధరణిమీదఁ బడనేయవె నీ
ధాటిన్ శ్రేష్ఠులు బొగడ ని
శాటఘ్నా వెంకటేశ ! శత్రువినాశా ॥

18 క॥ బాహాబలయుతుఁడైన సు
బాహుం బరిమార్చలేదె పటుశౌర్యమహా
సాహసబుద్ధులు నీవి ని
రీహా శ్రీవేంకటేశ యింద్రాదీశా ॥

19 క॥ సీతాపరిణయమునకై
యా తపసిని గూడి మిథిల కరిగెడువేళన్
రాతిని నాతిని జేయవె
ఖ్యాతిగ శ్రీవేంకటేశ కలుషవినాశా ॥

20 క॥ మారహరునిబాణాసన
మారూఢిగ విఱిచి మామ కనుమోదము సే
కూరన్ జానకిఁ గైకొను
ధీరుఁడవౌ వెంకటేశ దితిజవినాశా ॥

21 క॥ అలనాఁడగ స్త్యముఖముని
కులచంద్రులచే సపర్యగొని వనభూముల్
గలయఁ గనుంగొని పావన
ములఁ జేయవె వేంకటేశ భువనాధీశా ॥

22 క॥ ఖరసోదరినాసిక ము
ద్ధురవృత్తిన్ గోసివేసి తునిమితి వాజిన్
ఖరదూషణులన్ త్రిశిరునిఁ
బరశౌర్యా వెంకటేశ భవభయనాశా ॥

23 క॥ శ్రీధర కరుణాసాగర
మాధవ మురవైరి వరద మధుసూదన పృ
థ్వీధరభరణసమర్థ వి
రాధదమన వెంకటేశ రక్షోనాశా ॥

24 క॥ వాలికి సుగ్రీవునకు
ద్వేలపుఁబగసాగఁ దమ్ము మెసదయ వాలిన్
దూలించితి సుగ్రీవుని
యేలించితి వెంకటేశ యింద్రాదీశా ॥

25 క॥ చింతాభారాలసయగు
నింతికి నిజకుశలవార్త నెఱుఁగింప హనూ
మంతు న్బంపవె సద్గుణ
వంతున్ శ్రీవెంకటేశ వైరివినాశా ॥

26 క॥ బలనీలప్రముఖులు బహు
బలు లగువానరులు గూడి పర్వతవితతిన్
జలనిధి బంధించిరి నీ
బలముననే వెంకటేశ పాపవినాశా ॥

27 క॥ శంక యొకింతయు లేక ని
రంకుశబలవిక్రమముల నలరారిన యా
లంకాధీశునిఁ ద్రుంపవె
శంకరసఖ వెంకటేశ శత్రువినాశా ॥

28 వ॥ శరదభ్రశుభ్రదేహ
స్ఫురణ దిశల నిండ సమరభూమిఁ బ్రలంబా
సురునిం దెగటార్చిన హల
ధరమూర్తి వెంకటేశ దైత్యవినాశా ॥

29 క॥ పరవాసుదేవలీలన్
ధరణీభర మణఁచుటకును దాల్చితి విలపై
శరణాగతరక్షణ త
త్పరమతివై వెంకటేశ దైత్యవినాశా ॥

80 కం॥ రోఁత యొకించుక లే కవి
భీతమతిన్ జన్నుఁబాలు పీల్చి నిశాటిన్
బూతనను జంపవే శిశు
ఘాతిని, శ్రీవేంకటేశ కలుషవినాశా ॥

81 కం॥ ముద్దులబాలుఁడవగు నీ
గద్దరితన మరసి రోటఁగట్టినతఱి నా
మద్దులఁ గూల్చవె సర్వవి
పద్దళనా వేంకటేశ భవభయనాశా ॥

82 కం॥ హింసావిహారనిరతరి
రంసాపరతంత్రహృదయు రణకర్కశునిన్
గంసుని జంపితి వౌర నృ
శంసుని శ్రీవేంకటేశ శత్రువినాశా ॥

83 కం॥ గోవిభుఁడు శిలావృష్టి
న్యావిరిఁ గురియఁగ మహాద్రి వడిఁ దాల్చి కడున్
గోవులఁ గావవె శ్రీవసు
దేవాత్మజ వేంకటేశ దితిజవినాశా ॥

84 కం॥ గోపవధూజనములతో
నేప్రొద్దును గలసిమెలసి యిచ్ఛారతులన్
రేపల్లెవాడ నుండు ద
యాపర శ్రీవేంకటేశ యఘచయనాశా ॥

85 కం॥ కాళీయభుజగరాజఫ
ణాళిన్ గౌతుకముతోడ నమరులు వొగడన్
లీలానటన మొనర్చిన
బాలుఁడవౌ వేంకటేశ భవభయనాశా ॥

36 క॥ నారీమణి రుక్మిణికై
ఘోరరణ మొనర్చి రాజకోటులతోడన్
శూరత మెఱయఁగ శ్యాలకు
బీర మణఁచు వేంకటేశ భీతివినాశా ॥

37 క॥ దారయు బిడ్డలు మిక్కిలి
దారిద్ర్యముచేఁ గృశించుతఱి విప్రుఁడు నిం
జేరఁగ సిరుల నొసంగితి
వౌరా శ్రీవేంకటేశ యఘచయనాశా ॥

38 క॥ సురసిద్ధసాధ్య కిన్నర
గరుడాదులు విక్రమంబు గణుతింప మురా
సురయుతముగ నరకనిశా
చరుఁ జంపవె వేంకటేశ శత్రువినాశా ॥

39 క॥ పాండుసుతుని క్రతువున భూ
మండలపతు లెల్లఁ జూడ మదగర్వితునిన్
దండార్హుని శిశుపాలుని
ఖండింపవె వేంకటేశ కలుషవినాశా ॥

40 క॥ సంప్రధన కర్మశూరతఁ
దెంపరియగు భీముచేత ధృష్టునహంతా
నంపన్నుఁ జరాసంధునిఁ
జంపింపవె వేంకటేశ శత్రువినాశా ॥

41 క॥ దండితరిపు సైన్యుండగు
పాండవమధ్యమున కెలమిఁ బ్రాణసఖుఁడవై
ఖాండవము దహింపవె మును
జండప్రభ వెంకటేశ శత్రువినాశా ॥

42 క॥ గురుభీష్మాదుల చెంగటఁ
బరిషన్మధ్యంబునందుఁ బాంచాలికి వ
స్త్రరహితకును నంబరములు
గరుణింపవె వేంకటేశ కలుషవినాశా ॥

43 క॥ బంధురనిజవిశ్వాకృతి
గాంధారీవల్లభునకుఁ గాన్పింపఁగ గ
ర్వాంధులు భయపడ దృష్టులు
సంధింపవె వేంకటేశ శత్రువినాశా ॥

44 క॥ కౌరవసేనాసముదయ
పారావారంబుఁ జొచ్చి బడబాగ్నిక్రియం
గారించుపృథాసుతునకు
సారథివౌ వేంకటేశ శత్రువినాశా ॥

45 క॥ దురమున గురులం బెద్దలఁ
బరికింపుచు శోకమోహభరితాత్ముఁడౌ
నరునకుఁ దత్వముఁ దెలిపిన
పరమపురుష వేంకటేశ భవభయనాశా ॥

46 క॥ ఇద్ధప్రకాశమగు నీ
బుద్ధాకృతి జనములకును బూజ్యముగాదే
శ్రద్ధాభక్తియుతంబుగ
నిద్ధరణి న్వేంకటేశ యింద్రాదీశా ॥

47 క॥ తురగారూఢుఁడ వగుచును
గరవాలము చేతఁ బూని కల్క్యవతార
స్ఫురణన్ దురుష్కసేనన్
బరిమార్చవె వేంకటేశ భవభయనాశా ॥

48 క॥ దురితభవబంధచయసం
హారణంబులు తరుణకిసలయారుణంబుల్
నిరతము భజియించెద మీ
చరణంబులు వేంకటేశ శత్రువినాశా ॥

49 క॥ నీతో సమానదైవము
భూతలమునఁ గాదు సకలభువనములందు
న్జ్యోతింప రనుట వేద
ఖ్యాతముగా వేంకటేశ కలుషవినాశా ॥

50 క॥ గురుఁడవు తల్లివి దండ్రివి
పరదైవం బీవె గాక పరులెవ్వరు నా
మొఱ విని కావఁగ సర్వే
శ్వర రావా వేంకటేశ శత్రువినాశా ॥

51 క॥ జగములను సృష్టిసేయుఁగఁ
దగురీతిని బ్రోవ నడఁప దక్షుఁడ వీవే
నిగమాంతవేద్యరూపా
జగదీశా వేంకటేశ శత్రువినాశా ॥

52 క॥ నిగమములయందు గుప్తము
సుగమమె నీయెఱుక కదువిశుద్ధులు విబుధుల్
స్వగతముగ నెఱిఁగి తెలిపిరి
ఖగవాహన వేంకటేశ కలుషవినాశా ॥

53 క॥ దురితంబులు నీదగు సం
స్మరణంబునఁ దూలు నగ్నిసంస్పర్శముచేఁ
జొరుగాకులవలె వేఁడెద
శరణ మగుము వేంకటేశ శత్రువినాశా ॥

54 క॥ కరిరాజవరద నీదగు
చరితామృత మెలమిఁ గ్రోలి శాశ్వతపదవుల్
పురుహూతాదులు పడసిరి
కరుణింపుము వేంకటేశ కలుషవినాశా ॥

55 క॥ అణిమాద్యైశ్వర్యంబుల
ననువుపఱిచి భక్తవితతి కతిముద మొప్పం
గను వైకుంఠ మొసంగవె
వనజాక్షా వెంకటేశ భవభయనాశా ॥

56 క॥ జనహితకృతి నార్తావన
ఘనమతి నతిధర్మరతి నకలుషాకృతి నిన్
వినుతించు వ్రతిని విబుధులు
వినుతింతురు వెంకటేశ విశ్వాధీశా ॥

57 క॥ తరులందును గిరులందును
ఝరులందును ధరణి నాకసమునందుఁ జరా
చరములయందును నుందువు
నిరంతరము వేంకటేశ నిఖిలాధీశా ॥

58 క॥ నీవు న్వెలియగువస్తువు
లోకాలోకమ్ము దాటి లో వెలి నెందున్
లేకుండుట సర్వాత్ముఁడ
వై కలవో వేంకటేశ యఖిలాండేశా ॥

59 క॥ ఈశానబ్రహ్మాదులు
నీశాసనమునను గాదె నిఖిలైశ్వర్య
శ్రీశాలు లగుచు వెలయుదు
రీశా శ్రీవేంకటేశ యింద్రాదీశా ॥

60 క॥ క్రూరుఁడ నవిచారుఁడ దు
ర్వారభవాంబునిధి బడి దొరలుచున్నాఁడన్
దేరిచి దరిఁజేరిచి నను
దారి నడపు వేంకటేశ దైత్యవినాశా ॥

61 క॥ దీనుండను ముజ్జగముల
దీనదయాపరుఁడ వీవు దిక్కని మదిఁ బెం
పూనిన వేడుక నమ్మితి
శ్రీనిలయా వేంకటేశ శేషగిరీశా ॥

62 క॥ వారణరక్షణ ప్రియ భయ
హారణ భరితాంతరంగ యనవరతము నేఁ
గోరినకోరిక లొసగ వ
దేరా శ్రీవేంకటేశ యింద్రాదీశా ॥

63 క॥ ధనసంపద యట్టె యా
వనసంపద మీసతేనె వంటివి వేఁడన్
వెను కాడెద వీనిన్ బర
మును వేఁడెద వేంకటేశ భువనాధీశా ॥

64 క॥ ధనికుల నెంతయు వేఁడినఁ
దృణమైన లభించ దడవి దొరకొనకున్నె
ఘనముగ ఫలమూలాదులు
నినువేఁడఁగ వేంకటేశ నిఖిలాధీశా ॥

65 క॥ మునుపటి జన్మమ్ములలో
ననువుగఁ దాఁజేసినట్టి యతిపుణ్యావశం
బునను భవద్భక్తుండగు
మనుజుఁడు శ్రీవేంకటేశ మాప్రాణేశా ॥

66 క॥ ఘనదారేషణ పుత్రే
షణ విత్తేషణ విమోహసంపాదితమా
వనటల గుందెడి పురుషుఁడు
నినుఁ గనునే వేంకటేశ నిఖిలాధీశా ॥

67 క॥ హరి నీవె హరుఁడ నీవే
సరసీజోద్భవుఁడ నీవె శక్రుఁడ నీవే
ఖరకరుఁడవు శశి నీవే
పురుషోత్తమ వేంకటేశ భువనాధీశా ॥

68 క॥ ధర నీవె సలిల మీవే
శరయోనివి నీవె యనలసఖుఁడవు నీవే
సురవర్త్మ నీవె మురళీ
ధర మాధర వేంకటేశ దైత్యవినాశా ॥

69 క॥ నిత్యానిత్యము లీవే
సత్యాసత్యములు నీవె సర్వంసహపైఁ
బ్రత్యక్షదైవ మీవే
నిత్య శ్రీవేంకటేశ నిఖిలాధీశా ॥

70 క॥ నాతూత్కరించి కరుణా
వీక్షణములఁ జూడ వేర విధినుత లోకా
ధ్యక్షా యుపేక్ష సేయకు
మీక్షణమున వేంకటేశ యింద్రాదీశా ॥

71 క॥ రక్షింపు మిందిరావా
మాక్షీహృదయాబ్జమిత్ర యక్షీణదయా.
రక్షితమునిజన దానవ
శిక్షక శ్రీవేంకటేశ శేషగిరీశా ॥

72 క॥ అలమేల్మంగాగురుకుచ
కలశద్వయకుంకుమాంకకలితోరస్కా
విలసన్మకుటశిరస్కా
జలజాక్షా వేంకటేశ శత్రువినాశా ॥

73 క॥ కడు భక్తితోడ వేఁడిన
విడనాడుట మెరగాదు విశ్వేశ్వర నీ
విడువసుమీ నీవేగతి
జడధిశయన వేంకటేశ శత్రువినాశా ॥

74 క॥ సిరిగలవాఁడ నటంచును
విరివిగ నీ వెపుడు విఱ్ఱవీఁగెద వరయన్
దరిలేనివాని కొసగని
సిరి యేటికి వేంకటేశ శేషగిరీశా ॥

75 క॥ సిరి గల్గువారిచి త్తం
బరుణోత్పలభాతినుండు టర్హంబగు నీ
యురమున సిరి యుండిన మది
గరఁగదు శ్రీవేంకటేశ కలుషవినాశా ॥

76 క॥ శ్రుతిదూర మైనభోగవి
తతిచే గర్వితుఁడ నగుచు ధరణీస్థలి వి
ఖ్యాతిఁ గాంచితి నే నరయఁగ
నతినింద్యుఁడ వేంకటేశ యఘచయనాశా ॥

77 క॥ నీదారయు నీకొమరుఁడు
నీదగువాహనము లోకనింద్యగుణమునన్
వా దార్జించినవారలు
గాదా శ్రీవేంకటేశ కలుషవినాశా ॥

78 క॥ నీయాలు తటిచ్చంచల
మాయయుఁ దా నిలిచియున్న మనుజుని ఘనునిన్
జేయును, బోయిన నీచుని
జేయును, శ్రీవేంకటేశ శేషగిరీశా ॥

79 క॥ నీతనయుండగు మదనుం
డాతరుణశశాంకమౌళి కపకారకుఁడై
భూతిగఁ జేయంబడె విప
రీతముగా వేంకటేశ రిపుచయనాశా ॥

80 క॥ నీవాహన మగు ఖగపతి
దేవావళి కన్నమైన దివ్యామృతమున్
వావిరి దొంగిలఁడే మును
కేవలముగ వేంకటేశ కిల్బిషనాశా ॥

81 క॥ నీనాభీకమలోద్భవుఁ
డైన విధాత్రుఁడు గుణాఢ్యు నధికుని నాయు
ర్హీనునిఁగఁ జేయఁడే మఱి
దీనునిగను వేంకటేశ దితిజవినాశా ॥

82 క॥ నీవంటి మాయవానిన్
భూవలయమునందు నెందుఁ బొడగన మాగా
రీవల్లభ మోహితునిం
గావింపవె వేంకటేశ కలుషవినాశా ॥

83 క॥ సురలును దైత్యులు గూడుక
శరనిధి మథియించువేళ జనియించిన యా
పరమామృత మమరులకును
గరుణింపవె వేంకటేశ కలుషవినాశా ॥

84 క॥ మోహినివై పూర్వము దు
ర్మోహాంధులఁ జేయలేదె మునులను హరునిఁ
సాహస మదేమి నీకు ని
రీహా శ్రీవేంకటేశ యింద్రాదీశా ॥

85 క॥ దాసుని నను విడనాడిన
దాసావనబిరుదు నీకు దబ్బఱ గాదే
శ్రీసఖ నీసన్నిధి సం
వాస మొసఁగు వేంకటేశ వనజాధీశా ॥

86 క॥ దానగుణ మించు కేనియు
గానక ధనవంతుఁడైన కడులోభిని స
మ్మానించు జడుఁడు నిన్నుఁ
ధ్యానింపఁడు శ్రీవేంకటేశ దైత్యవినాశా ॥

87 క॥ వడ్డిజీవన మిలపైఁ
జెడ్డతన మటంచు మునులు చెప్పఁగ వినమే
వడ్డికాసులు గొను టది
దొడ్డతనమ వేంకటేశ దురితవినాశా ॥

88 క॥ ధనవంతుఁడయ్యుఁ బండిత
జనములఁ బోషింపలేని జనుఁడు జఘన్యుం
డను నపదూఱుం జెందక
ఘనుఁడగునే వేంకటేశ కలుషవినాశా ॥

89 క॥ ధన మార్జించినతఱి స
జ్జనులను బుధజనుల సాధుజనులను రక్షిం
చినవాఁడె ధన్యుఁడగు కవి
జననుత శ్రీవేంకటేశ శత్రువినాశా ॥

90 క॥ పరులకు నుపకృతిసేయని
నరుజన్మము తల్లికడుపునకుఁ జేటు సుమీ
పరధర్మము పరహితమే
పురుషోత్తమ వేంకటేశ భువనాధీశా ॥

91 క॥ పరసతులదోష మెన్నక
పరభామను జూచి తనదుభగినికి సుతకున్
సరి యనుకొను నరుఁ డుత్తమ
పురుషుఁడు శ్రీవేంకటేశ భువనాధీశా ॥

92 క॥ అరయఁగఁ బరోపకారము
పరధర్మము దానియట్లె పరపీడసమున్
బరమాధర్మము ధర్మో
త్తరత నొసగు వేంకటేశ దైత్యవినాశా ॥

93 క॥ ఎటెఁగెటెఁగి చెడుగుచేసెడు
కొఱగానిదురాత్ము నెట్లు కో నరిదిద్దన్
జిఱుకత్తిచేతఁ గఱకఱ
నఱుకవలెనొ వేంకటేశ నాకాధీశా ॥

94 క॥ నీపాదకమలసేవా
వ్యాపారతఁ జెలఁగుచున్నవాని కసాధ్యం
బేపట్లను గలుగదు భువి
లోపల శ్రీవేంకటేశ లోకాధీశా ॥

95 క॥ సురుచిరలీలన్ జగముల
కిరవగు గర్భంబుగలుగు నీశ్వర నీకుం
ధరణీస్థలి ననుఁబ్రోచుట
భరమా శ్రీవేంకటేశ భవభయనాశా ॥

96 క॥ అరమరసేయక నన్నుఁ బ
బరిచరుఁగాఁ జేసికొనుట బహుభంగుల నీ
పరిపూర్ణత్వమునకుఁ దగు
సరణియె శ్రీవేంకటేశ శత్రువినాశా ॥

97 క॥ జడమతిని దోషినని నా
యెడ నేరములెన్న దేమి యిల జనకుఁడొగిన్
గొడుకున్ మూర్ఖుని విడుచుట
నడవడియే వేంకటేశ నాగగిరీశా ॥

98 క॥ పరసద్గుణముల మెచ్చుచుఁ
బరసంపద కిష్టపడుచుఁ బరనిందాదుల్
తొఱఁగినవాఁ డిమ్మహిఁ స
త్పురుషుఁడగుం బరగుగాదె భువనాధీశా ॥

99 క॥ నీనామశతము పేర్కొనఁ
గా నీపైఁ బద్యశతము గల్పింపంగా
మానస మువ్విళ్లూరెను నీ
ధ్యానార్థిని వేంకటేశ ధర్మోద్దేశా.

100 క॥ కింకరకల్పకమా భవ
సంకటహరనామ శేషశైలస్థేమా
అంకిత మిది గొను మోంకా
రాంకూరా వేంకటేశ యఖిలాండేశా ॥

శ్రీ

# శ్రీవేంకటేశ్వరలఘుకృతులు

## వేంకటాచలధామ తారావళి

1 క॥ శ్రీమహిళామహీమహిళల
తో మముఁ బోషింపవచ్చితో నేఁడైనన్
ప్రేమమున సజలజలద
శ్యామలతనుధామ వేంకటాచలధామా.

2 క॥ రావయ్య యేడుగొండల
దేవుఁడవా శరణు శరణు దితమముతాహం
భావనమున పావనజన
తావనఘుసనామ వేంకటాచలధామా.

3 క॥ నే నెక్కడ మీ విభవము
దా నెక్కడ నేర్చిపొగడఁ దరమా నాకున్
దానవకులతానవకల
నానవబలధామ వేంకటాచలధామా.

4 క॥ అవధారు దేవ బవదభి
నవకవన మొసర్ప నేర్పు నా కొసగుము దా
నవవనదావీభవదా
హావబాహాస్థేమ వేంకటాచలధామా.

5 క॥ కోరినవరాలరాయఁడ
వౌరా! దుర్నిగ్రహోగ్రహాగ్రహిళధరా.
ధారమహోదార మహో
దారమహోద్దామ వేంకటాచలధామా.

6 క॥ అమ్మమ్మ రాజసం బిటు
రమ్మని మముఁ జేరదీయ రాదా యసురీ
ధమ్మిల్లామోదభిదా
హమ్మహానిస్సీమ వేంకటాచలధామా.

7 క॥ భవదంఘ్రిద్వయసేవా
ప్రవణులఁ గావింపవా దురాత్ముల మగుమ
మ్మవిరళభవానుభవజగ
దవనమహోద్దామ వేంకటాచలధామా.

8 క॥ తొలుపలుకు గిలుకుపావలు
గులుకుభవత్పదయుగం బకుంఠితభక్తిన్
గొలుతున్ ద్రిభువనహేలా
హాలదసురవిరామ వేంకటాచలధామా.

9 క॥ శరణాగతానుధావన
బిరుదాంకుఁడ విపుడదేల పిలిచిన దయతో
నరుదే వరిరంహాస్సం
హరణరణస్థేమ వేంకటాచలధామా.

10 క॥ ఎప్పుడును శరణాగత వ
జ్రపంజరపు బిరుదుదాల్చు రాజవుగా మ
మ్మిపుడేల తేలఁ జూచెద
వపరిమితస్థేమ వేంకటాచలధామా.

11 క॥ నీబంటనె ముమ్మాటికి
నీబంటనె వేఱొకండనే జగదవన
శ్రీబంధ బంధురాంఘ్రి మ
హాబిరుదోద్దామ వేంకటాచలధామా.

12 క॥ దాసుని యిల్లాలలసిన
యోసామీ కొంచె మనక యుప్పరతట్టల్
మోసితి వట భక్తార్తిని
రాసరసోద్ధామ వేంకటాచలధామా.

13 క॥ మెచ్చెదవుగాక భక్తుల
కిచ్చెద వీరానిపదవు లిందును నందుఁ
గచ్చుగఁ దిరిగెద వఖిలవి
యచ్చరనిస్సీమ వేంకటాచలధామా.

14 క॥ ఒకటానోచనిగొ్రడా
లికి బిక్షల నిత్తువట భళీ జగముల నీ
వొకఁడవె దైవశిఖామణి
వకలుషగుణధామ వేంకటాచలధామా.

15 క॥ ముజ్జగముల నేలెదు నీ
బొజ్జనుఁ జేరుళ్ల బియ్యపుందళిగ లయో
సజ్జాయె బ్రతుకు సమిదుద
యజ్జయగోక్షేమ వేంకటాచలధామా.

16 క॥ ఎల్లప్పుడు నీతోమని
పళ్లెరముల నారగించు బల్ జాణవు చే
సళ్లనట పోయి వేఁడెద
మల్లదె నీలేమ వేంకటాచలధామా.

17 క॥ ఇల్లిల్లు దిరిగి నీవొక
చెల్లనికాసునకు నైనఁ జేసాచెదు వా
ల్లల్ల సిరులల్ల నొసగెదు
నల్లదె నీలేమ వేంకటాచలధామా.

18 క॥ వేసరక వడ్డికాసుల
కాసులచే నింత లిబ్బి గట్టెద వీక నీ
యాసవలెం గాదె యడియని
యాసయు నోరామ వేంకటాచలధామా.

19 క॥ అడియాల మెఱుంగ నీవడు
గడుగుందండాలసామివా దండము నీ
యడియడను నీవె మాకొడ
యఁడ వసురవిరామ వేంకటాచలధామా.

20 క॥ కలకాలము నాపదభ్రము
క్కులు సంపద మఱపు లేలో కోయని కొదవల్
దలంచకు మాశ్రితరత్నా
హాలహాలికోద్దామ వేంకటాచలధామా.

21 క॥ నిగ్రాహ్యుండ నే నైనన
నుగ్రహవదపాంగములఁ గనుంగొను మతిదు
ర్నిగ్రహమహాగ్రహాగ్రస
నాగ్రహహృన్నామ వేంకటాచలధామా.

22 క॥ భూతప్రేతపిశాచ
వ్రాతంబులు దొలఁగవా భవత్పదరేణు
వ్రాతంబు సోకినను జగ
దాతంకవిరామ వేంకటాచలధామా.

23 క॥ వేంకటపతి వేంకటపతి
వేంకటపతి యనినఁ దొలఁగవే గ్రహశంకా
తంకంబు లఖిలజగ దభ
యంకరశుభనామ వేంకటాచలధామా.

24 క॥ పలుమఱును బెక్కువేషం
బులు పన్నక నీదుసముఖమున నాడెడు న
న్నలసితివి చాలు నీక నను
మలఘుదయారామ వేంకటాచలధామా.

25 క॥ వెనువెంట వచ్చువారల
ననుపుటకై తడసెదేని యమభటజనభం
జనపాంచజన్య మపు డో
య్యనవొత్తుము ప్రేసు వేంకటాచలధామా.

26 క॥ మంగళ మలమేల్మంగకు
మంగళ మలమేలుమంగమగనికి నని మీ
మంగళ మేమఱ వెంద సమ
రాంగణనిస్సీమ వేంకటాచలధామా.

27 క॥ శ్రీమదఖిలాండకోటి
స్వామివిగా మాకుఁ గులముసామివిగా యీ
మామీఁదిమమత మఱవకు
మామయుహృన్నామ వేంకటాచలధామా.

28 క॥ ఘటియించె మాయదుముఖావేం
కటపతి నీపేరనొక చొకాటపుఁ గృతి త
ద్ఘటకాగ్రేసరుఁడవు నీ
వట కపటవిరామ వేంకటాచలధామా.

శర్మపురి వేంకటశాస్త్రిగలు హేశిద (సంస్కృతోదాహరణ) తెలుగుపద్యగళు.

—ంంఁంఁంం—

శ్రీ

# శ్రీవేంకటేశ్వరలఘుకృతులు

## పంకజాతభవాండేశశతకము

1 సీ॥ శ్రీమత్త్వదంఘ్రిరాజీవసేవాసక్తి
నిరతంబు నామది నిలుపవయ్య
శ్రవణేంద్రియముల మీసచ్చరితామృత
మధుధార లానఁగా మఱుపవయ్య
నేత్రద్వయంబు మీనిరుపమసౌందర్య
విభవ మీక్షింపఁ గావింపవయ్య
సతతంబు జిహ్వ మీపతితపావననామ
కీర్తన సలుప శిక్షింపవయ్య
తే॥ యేను నీకన్న నితర మే మెఱుఁగ నెందు
దాసునిఁగ నన్ను నాత్మలోఁ దలఁపవయ్య
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వెంకటేశ ॥

2 సీ॥ పదపద్మరజముచేఁ బాషాణమైనసతా
పసకాంత కలుషంబుఁ బాపినావు
శరణు సొచ్చినవిభీషణు విపక్షానుజుం
డనక కృపాదృష్టి మనిచినావు
ఆర్తయై వేఁడినయంతనే పాంచాల
కన్యకమానంబు గాచినావు
మకరిపాల్పడినసామజము కుయ్యాడిన నా
లించి వే దాని రక్షించినావు

తే॥ నన్ను నారీతిఁ బ్రోవు మనాథనాథ
నీకు నే నన్యుఁడనుగాను నిజముగాను
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వెంకటేశ ॥

3 సీ॥ కల్పాంతమున బ్రహ్మ కనుమూసి నిదురింప
సోమకుండను రాక్షసుండు కడఁగి
నిగమము ల్కుమ్మిచ్చిలి నీటిలోఁ జొచ్చిన
జలచరరూపమై సరభసమున
దైత్యునిఁ బోనీక తరిమి గర్భము చించి
విపులవేదమ్ముల వెలికిఁ దెచ్చి
సత్యలోకంబునఁ జతురాననున కిచ్చి
చెలఁగిలోకములు రక్షించినట్టి

తే॥ లోకరక్షకుఁడవు భువనైకవంద్య
నన్ను రక్షించు టొకప్రయత్నంబె నీకు
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వేంకటేశ ॥

4 సీ॥ అమరులు దైత్యులు నమృతంబుఁ గొనుటకై
మందరనగమును మంథదండ
కమ్ముగాఁజేసి కొంకక సుధాంబుధివైచి
తవిలి వాసుకిఁ దరిత్రాడునేసి
యిరుగడ నైకొని గరిమతోఁ దరువంగ
బ్రుంగన శైలంబు గ్రుంగఁజూచి,
కమఠరూపంబునఁ గరమొప్పి శైలంబు
ధరియించినట్టి శ్రీధరుఁడ వీవు

తే॥ నీకు సంరక్షకులు లేరు లోకమునను
నన్నుఁగృపతోడఁబ్రోవుము నలిననేత్ర
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వేంకటేశ ॥

5 సీ॥ కశ్యపాత్మజుఁడైన ఖలుఁడు హిరణ్యాక్షుఁ
డాదికాలంబున నతులశక్తి
ధరణి గైకొని రసాతలమునకును బాఱి
పాఱెందు లేకుండ మలయుచుండ
యజ్ఞవరాహమై యవతరించి నిశాటు
ఘనగదాహతి మస్తకంబు దునిమి
కొనగొమ్మున ధరిత్రి గొనివచ్చి నీటిపై
నిలువంగఁ దనబల మ్మలవఱించి

తే॥ విశ్వ మొగి నుద్ధరించిన విభుఁడవీవు
నీకు ననిశంబు మ్రొక్కెద నిగమవేద్య
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వేంకటేశ !

6 సీ॥ భ్రాత వధించిన పగఁదలంచి హిరణ్య
కశిపుఁడు ఘోరదుర్గముల కేఁగి
తపమాచరించి విధాతచే వరములు
గొని మహాదుష్టుఁడై కనులు దిరిగి
తనయునిఁ బ్రహ్లాదు ననుపమచారిత్రు
భాగవతశ్రేష్ఠు బహువిధముల
హింసింప మనుజమృగేంద్రరూపము దాల్చి
కదిసి విపక్షు వక్షము పగుల్చి

తే॥ తునిమి భక్తునిఁ గాచినఘనుఁడ వీవు
నిన్ను బ్రహ్మకు నైన వర్ణింపఁదరమె
శేషశైలాగ్రవాస లక్ష్మీని వాస
పంకజాతభవాండేశ వేంకటేశ ॥

7 సీ॥ బలి యనుదైత్యుండు బలసూదనునిఁ దోలి
నాకంబు గైకొని ప్రాకటముగ
మూఁడులోకంబుల ముదముతో వెలుఁగంగ
నదితితపంబున కాత్మ మెచ్చి
వామనరూపమై ప్రేమతో నుదయించి
బలిని దానము మూఁడుపదము లడిగి
ముల్లోకములు నిండి మొనసి వైరోచను
బంధించి వజ్రికిఁ బదవి యొసగి

తే॥ నట్టిభక్తశరణ్యుఁడ వనఘచరిత
నిన్ను నుతియింప శక్యంబె నీరజాక్ష
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వేంకటేశ ॥

8 సీ॥ భార్గవకులమునఁ బావనుం డై నట్టి
జమదగ్నిసుతుఁడవై జననమంది
తండ్రినిఁ జంపినదారుణకర్మునిఁ
గార్తవీర్యార్జునుఁ గదిసి వేయు
చేతులు పరశువుచేఁ ద్రుంచి పొలియించి
రాజవంశములు నిర్వంశములుగఁ
జేసి ధారుణి యెల్ల భూసురులకు దాన
మిచ్చినరాముఁడ వీవ కావె

తే॥ నిను నుతింపంగ వశమె శేషునకు నైన
విమలచారిత్ర సంపుల్లకమలనేత్ర
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వేంకటేశ ॥

9 సీ॥ పౌలస్త్యుడైన రావణుఁడు బ్రహ్మను గూర్చి
తపము గావించి విధాతవలన
వరములు గైకొని సురుల బాధింపంగ
నమరులు మునులు మి మ్మాశ్రయించి
తమపడ్డబన్నముల్ తగ విన్నవించిన
భువనముల్ రక్షించ బుద్ధిఁ దలఁచి
దశరథాత్మజుఁడవై ధారణి జన్మించి
దశకంఠుబలసహితంబుగాగ

తే॥ వసుధఁ గూల్చినయూరఘువరుఁడ వీవ
యేను నీమహిమం బెన్న నెంతవాఁడ
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వేంకటేశ ॥

10 సీ॥ ధారుణి దుష్టవర్తనుల మోవఁగలేక
బ్రహ్మపాలికి నేఁగి బాధపడిన
ద్రుహిణుండు వసుమతీసహితంబుగా మిమ్ముఁ
జేరి ప్రణామముల్ చేసి వసుధ
రక్షింపు మని వేఁడ రాజవంశంబున
వసుదేవసుతుఁడవై వెస జనించి
ఖలులైనధారుణీశుల నెల్లఁ బరిమార్చి
భూభార ముడిపినపుణ్యమతివి

తే॥ రాముఁడవు నీవె కావె పురాణపురుష
నిన్ను వర్ణింప శక్యమే నిర్మలాత్మ
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వేంకటేశ ॥

11 సీ॥ త్రిపురదైత్యులు భారతీనాధువరముచే
సురల కసాధ్యులై యురుబలమున
మూఁడులోకములకుఁ గీడాచరింపుచు
జరియింప నీక్షించి హరుని రథికుఁ
గావించి సారథిగాఁ బద్మజు నమర్చి
నీవు బాణంబవై నేర్పుమెరసి
రాక్షసస్త్రీపతివ్రతము భంగము సేయు
తలఁపున బౌద్ధావతారమెత్తి

తే॥ పౌరకాంతలనియమముల్ పాపి పురము
లొకటిగాఁ గూల్చి కాల్చినయోధవీవు
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వేంకటేశ ॥

12 సీ॥ కలియుగాంతంబున ఖలులు రాజ్యముసేయ
సకలధర్మములు నష్టంబు లగుచు
పాపభూయిష్ఠమై బ్రాహ్మణుల్ వ్రాత్యులు
రాజులు తస్కరప్రాయు లగుచు
వర్తింప శ్రుతులను వరనదీజలము లు
త్సన్నంబులై మహాతామసాంబ
రంబుల ధరణీతలంబు తల్లడమందఁ
గల్కిరూపము దాల్చి ఖడ్గధారఁ

తే॥ పాపకర్మల నెల్లను బాపుమాపి
ధర్మ మవనిఁ బ్రతిష్ఠించి తనరె దీవు
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వెంకటేశ ॥

13 సీ॥ జగతి పాదము లాకసము నాభి నిశ్వాస
మనిలుండు రవిచంద్రు లక్షియుగము
దిశలు కర్ణంబులు దివి శిరం బనలుండు
వదనంబు జలములు పాణియుగము
జంగమస్థావరసహితమై యున్న యీ
విశ్వంబు నీశక్తి విమలచరిత
ఆద్యంతరహితుఁడ వసదృశుండ వనంతుఁ
డవు నచ్యుతుండవు భవవిదూర

తే॥ విశ్వమంతయు నీమూర్తి వేఱలేదు
నిన్ను శరణంబు వేఁడెద నిష్కళంక
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వెంకటేశ ॥

14 సీ॥ నీపదాంబుజములు నిత్యంబు పూజగా
వింపనికరములవెం పదేల
ప్రేమతో నీచరిత్రామృత మనుదినం
బానంగలేని యుప్పీను లేల
నీదివ్యనామంబు నిరతంబు పఠనంబు
సేయంగలేని యీజిహ్వ యేల
నీయుత్సవములకుఁ బోయి నిభక్తితో
నడవక యున్న యియ్యడుగు లేల

తే॥ నిన్నుఁ గడువేడ్కఁ జూడనికన్ను లేల
యిన్నియును జిత్రరూపంబు లెన్ని చూడ
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వెంకటేశ ॥

15 సీ॥ నీపదాంభోజముల్ నిశ్చలహృదయుఁడై
యతిభక్తిఁ బూజ సేయంగవలయు
పావనంబైన మీపాదపద్మములకు
ముదమొప్ప నిలఁజాగి మ్రొక్కవలయు
పాపహారంబు మీపాదాబ్జతీర్థంబు
లేపార జిహ్వాయం దిడగవలయు
నీపదాబ్జార్చితనిర్మలతరతుల
సీదళం బెలమి భక్షింపవలయు

తే॥ వినతుఁడై మిమ్ము శరణంబు వేఁడవలయు
కలుషములఁ బాసి మిముఁజేరి వెలయవలయు
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వెంకటేశ ॥

16 సీ॥ నీచరిత్రంబులు నిరతంబు వినువాఁడు
వసుధాధిపత్యంబు వాంఛపడఁడు
నీపాదకమలసేవాపరుం డగువాఁడు
స్వర్గభోగంబులసరణిఁ జనఁడు
నీదివ్యమంత్రమే నిష్ఠగాఁ గలవాఁడు
చక్రవర్తిత్వంబు నరకుగొనఁడు
నీమూర్తి నాత్మలో నేర్పునఁ గనువాఁడు
బ్రహ్మలోకసుఖంబు భ్రాంతిపడఁడు

తే॥ కల్పవృక్షంబు ముంగిట గలుగువాఁడు
అడవి నున్నట్టిఫలముల కాసపడునె
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వెంకటేశ ॥

17 సీ॥ కరుణారసాపాంగ ఘననిభశ్యామాంగ
పతగరాజతురంగ ధృతరథాంగ
పావనచారిత్ర పద్మజస్తుతిపాత్ర
శంకరసన్మిత్ర జలజనేత్ర
పతితపావననామ జితదానవస్తోమ
పాలితసుత్రామ భవవిరామ
జలనిధిగంభీర సద్భక్తమందార
నిరుపమాకార వర్ణితవిహార

తే॥ సంతతోల్లాస సజ్జనస్వాంత వాస
సర్వలోకేశ మునిజనసన్నిదేశ
శేషశైలాగ్రవాస లక్ష్మీ వాస
పంకజాతభవాండేశ వెంకటేశ ॥

18 సీ॥ అన్య మెఱుంగక యహరహంబును భవ
త్కైంకర్యమునఁ బ్రొద్దు గడపవలయు
నితరవాంఛలు మాని సతతంబు నీకథా
సుధ కర్ణపుటముల జుఱ్ఱవలయు
నీవె దైవంబని నెఱనమ్మి సకలార్థ
సంపత్తి నీకు నర్పింపవలయు
ధర్మార్థకామము ల్దలఁపక నీదివ్య
పదమున కయనంబు వెదకవలయు

తే॥ నీకృపకుఁ బాత్రభూతుఁడై నెగడవలయు
నిన్నుఁ జేరంగగోరుప్రపన్నుఁ డెపుడు
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వెంకటేశ ॥

19 సీ॥ పరమేష్ఠినుతిపాత్ర నిరుపమచారిత్ర
శశిదివాకరనేత్ర శ్యామగాత్ర
సురమునీశ్వరగేయ వరనూపురామ్నాయ
దళితదైతేయ పద్మాసహాయ
కాకుత్స్థకులదీప ఖండితహరచాప
విశ్వస్వరూప రవిప్రతాప
సర్వలోకాధార సద్గుణాలంకార
శ్రుతిగుహాసంచార నుతివిహార

తే॥ సంతతోత్సాహ విజితదుర్జనసమూహ
సమరముఖదేవతాభీమ సార్వభౌమ
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వెంకటేశ ॥

20 సీ॥ క్షీరాబ్ధిమధ్యవీచీడోలికాలోల
పన్నగాధీశతల్పంబునందు
పద్మావసుంధరాభామామణు ల్పాద
పంకేరుహంబులు పరిచరింప
భానుకోటిప్రభాభాసమానానూన
కోటీరకాంతులు కొమరుమిగుల
శ్రుతిచతుష్టయము సంస్తుతు లొలిఁ జేయింప
యోగనిద్రారతి నొప్పుమిగులఁ

తే॥ బవ్వళించిననీమూర్తిఁ బ్రతిదినంబు
భావమునఁ జేర్చి మ్రొక్కెద దేవదేవ
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వేంకటేశ !

21 సీ॥ మహితజాంబూనదమణికిరీటద్యుతుల్
రవికిరణంబులఁ గ్రమ్మరింప
నవరత్నమయదివ్యనక్రకుండలకాంతి
గండభాగంబుల మెండుకొనఁగ
కంఠభాగవిలగ్నకౌస్తుభమాణిక్య
దీధితుల్ దిక్కులఁ దేజరిల్ల
రమణీయమౌక్తికరత్నహారవినూత్న
తరళద్యుతు ల్నభస్థలమునిండ

తే॥ యురమునం దలమేల్మంగ యురువుసూప
నిలిచియున్నట్టినీమూర్తిఁ గొలుతు నెపుడు
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వేంకటేశ ॥

22 సీ॥ పన్నగాధిపతల్ప పావనసంకల్ప
భవతూలకృతశిల్ప బహుపరాకు
శాతకుంభదుకూల సదమలగుణజాల
పద్మాలయాలోల బహుపరాకు
నిగమాగమస్తోత్ర నిరుపమచారిత్ర
పద్మజస్తుతిపాత్ర బహుపరాకు
ధారాధరశ్యామ దళితాసురస్తోమ
పార్వతీనుతనామ బహుపరాకు

తే॥ దేవదేవ పరాకు మీసేవకుఁడను
నీవె దిక్కనియున్నాఁడ నిక్కముగను
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వేంకటేశ ॥

23 సీ॥ నవమోహనాకార నతజనమందార
సర్వలోకాధార శరణుశరణు
కాంచనాచలధీర కందర్పసుకుమార
జలనిధిగంభీర శరణుశరణు
భవలతైకలవిత్ర పరహితచారిత్ర
సురగణాహితజైత్ర శరణుశరణు
కరుణారసాపాంగ ఖగనాయకతురంగ
కరధృతోగ్రరథాంగ శరణుశరణు

తే॥ నీకు శరణని వేఁడెద లోకనాథ
కరుణఁ జూడుము నన్ను నోసురశరణ్య
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వేంకటేశ !

24 సీ॥ శరణాగతత్రాణబిరుదు నీకై యుండ
నన్యులఁ శరణని యనఁగ నేల
భక్తులపాలికల్పద్రుమం బీవయై
విహరింప నన్యుల వేఁడనేల
పాపఘ్ని గంగ మీపాదపద్మంబున
విలసిల్ల తీర్థముల్ వెదకనేల
పరగ లోకములకుఁ బ్రభువ వీవై యుండ
నిలమానవులఁ జేరికొలువనేల

తే॥ నిన్ను నెఱనమ్మియున్నట్టి నేర్పులకును
కొదవ లేదైనఁ గలదె సంపదలెకాక
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వేంకటేశ!

25 సీ॥ బ్రహ్మకల్పంబున బ్రహ్మాండ మంతయుఁ
బాలుపేది నీయందుఁ గలయుటయును
జలనిధు లన్నియు గలసి యేకార్ణవం
బైకడలెత్తి మిన్నందు బ్రోయ
బాలుండవై వటపత్రపుటంబునఁ
బవళించి యుండగ బ్రకృతి మిమ్ముఁ
బ్రార్థింప మీనాభి పంకజంబునఁ జతు
రాననుఁ బుట్టించి యతనివలన
తే॥ విశ్వమెల్ల సృజించి విభుఁడ వీవు
నీకు సరివేల్పు లెవ్వరు లోకములను
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వేంకటేశ

26 సీ॥ కంజాక్ష నీపాదకమలతీర్థమునకు
సకలతీర్థంబులు సాటిగావు
కమలేశ మీనిత్యకైంకర్యమహిమకు
సకలయజ్ఞమ్ములు సాటిగావు
సదయాత్మ మీమూర్తి హృదయమం దిడుటకు
సకలతపంబులు సాటిగావు
కేశవ మీనామకీర్తనంబు కిల
సకలధర్మంబులు సాటిగావు
తే॥ నిన్ను సేవించుమానవు లెన్నటికిని
భవము నొందరు నీదివ్యపదముచేరి
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వేంకటేశ॥

27 సీ॥ నీనాభికమలంబులో నుద్భవించి లో
కంబులు సృజియించెఁ గమలభవుఁడు
గంగ నీపాదపంకజమున జనియించి
వసుమతి యెల్లఁ బావనముఁజేసె
నామ్నాయములు నీముంఖాంభోజమున సంభ
వించి విశ్వంబున వినుతికెక్కె
భవుఁడు నీనామజపప్రభావంబున
గళమునందు వహించెఁ గాలకూట

తే॥ మనఘ నీ పాదపంకేరుహాశ్రితులకు
సకలలోకంబులందు నసాధ్య మెద్ది
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వేంకటేశ !

28 సీ॥ నీయాజ్ఞ తలఁ దాల్చి నిరత మాదిత్యుండు
మేరుప్రదక్షిణం బారఁ జేయు
నీయాజ్ఞ యెదనిల్పి నీరధుల్ చెలియలి
కట్ట దాఁట వశంబు గాకయుండు
నీయాజ్ఞ ననిశంబు వాయుదేవుం డొక్క
చోట నిల్వక యెల్లచోఁ జరించు
నీయాజ్ఞ నాత్మలోఁ బాయక మృత్యువు
పాఱివచ్చుచునుండు భయముతోడ

తే॥ విశ్వమెల్లను నీయాజ్ఞ వెలయు నెపుడు
విశ్వమయుఁడవు నీవు యోగీశ్వరేశ
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వేంకటేశ !

శ్రీ

# శ్రీ వేంకటేశ్వరలఘుకృతులు

## వేంకటశైలనాయకశతకము



1 చ॥ దురితములన్ విదల్ప భవదుఃఖములన్ హరియింప నీవసుం
ధరకును నీవిలాసము నిధానముగాఁ గనుపింపఁ జేయ సుం
దరమగు నీస్వరూపము ముదంబునఁ జూపినస్వామి శౌరి సత్
కరుణను నన్నుఁ గావు మిఁక గట్టిగ వేంకటశైలనాయకా ॥

2 చ॥ అతులితఘోరదుష్కృతము లన్నిఁటికిం గలి పట్టుఁగొమ్మ స
ద్గతిఁ గనలేని యీనరులఁ గావఁగ ది క్కెవరింక నంచులోఁ
గుతుకముమీఱ దర్శనము కుంభిని కెల్ల ననుగ్రహించితౌ
సతతము నన్నుఁ గావు మిఁక సద్గుణ వేంకటశైలనాయకా ॥

3 ఉ॥ పావనమైన మీచరణపద్మయుగంబు నిరంతరంబు గన్
భావమునందు నిల్పుకొని ప్రస్తుతిసేయుచునున్న నాయెడన్
దేవర యింతదాఁకఁ గరుణింపమికిం గత మేమి తెల్పు రా
జీవభవామరాశ్రితవశీకర వేంకటశైలనాయకా ॥

4 చ॥ శరణని నీకు మ్రొక్కితిని జాలముసేయక నీవు నాయెడన్
పరమకృపన్ వహించి ననుఁ బాయక నాకలుషంబు లన్నియున్
దురుముగఁ జేసి నీచరణతోయజయుగ్మముఁ జూపినంతటన్
వెరవుగ నిన్ను గొల్తు నిఁక వేడుక వేంకటశైలనాయకా ॥

5 చ॥ కురుపతి యాసభాస్థలిని గోకలు దోచిన భీతిచేత శ్రీ
హరి ననుఁ గావుమంచు మది నార్తిని వేఁడినయంతలోన మీ
కరుణనె యక్షయంబయిన కాంచనచేలము లద్భుతంబుగా
విరివిగ రావె ద్రౌపదికి వింతగ వేంకటశైలనాయకా ॥

